శ్రీగురుభ్యోనమః.

# ఆనందసుధాలహరి.

ఉ. శ్రీగురుపాదపద్మములు చేరిభజించెడివారికెవ్వరున్
రాగముద్వేషమున్ భ్రమయు రాజసవృత్తులడంగితత్కృపా
సాగరవీచికావృతుల చక్కఁగఁదోఁగికృతార్థులాదురా
చాగమవేత్తలాడఁబనియద్భుతమౌనది యందగోరి దు
ర్యోగముబాసిసత్యపద యుగ్మమునమ్మితరింపగంటినే
నోఘనతేజనిత్యవిభవోజ్వలవీరగురోః కృపానిధే.

దసరాపద్యములమాదిరి, నవరోజు - ఆది.

1. శ్రీహరినెప్పుడు చిత్తములోపలచింతసేయుమన్న।
నీపకగురుచంతజేరుమన్న। దుర్గుణములుదొలగిపోవునన్న।
పాపంబులుబాసిపోవునన్న। యీధారుణిలోపలదైవముయా
త్మారాముడెగనుమన్న। నీపాపముచెండివేయునన్నా॥ శ్రీ॥

2. యిలపైదాసులనేలువానియెడ పాలుమాలకండి।
మీలోపలచాలగదరచండి। యీజగముకు మూలమతడుసుండి।
భక్తజనలోలుడతడనండి॥ యాకాలునాలయముజేరకసద్గురు।
కీలునుదెలియండి। మేలుమేలిదియెమీకుసుండి॥ శ్రీ॥

3. ధరణిలోనతలిదండ్రిదాతగురుడనుచు టెలియుమన్న।
తదితరమునెన్న బోకుమన్న। నీహృదయముదరచిచూడుమన్న।
నీకెందునకొరతశాయడన్న॥ నీకరములుమోడ్చియుసతతము
సద్గురు। స్మరణసల్పుమన్న। నీవుకడతేరెదవోయన్నా॥ శ్రీ॥

4. దేహములోపలదేవునిదెలియను సాహసించుమన్న।
యీమోహముమోసపుచ్చునన్న। నీయూహానుగుతుని మరువక
న్న। యాసోహమెదిక్కకమనకన్న॥ నీదోహములన్ని యుదొల
గుటకిఏయేతోవదెలియుమన్న।నీమదిలోనహముపిడువుమన్నా

5. అరిషడ్వర్గములణచియాత్మనే మారకుండుమన్న। [శ్రీ॥
నిరతమానందమదేనన్న। నరయనాసాధ్యమదేనన్న।
కోరిగురునడిగి జెలియుమన్న॥ సారెసారెకునివారిమధ్యగల
దారిజూడుమన్న। దారిదేముక్తిగనుటకన్నా॥ శ్రీహరి॥

మీరియవస్థాత్రయసాక్షియై యాత్మనుచు దెలియుమన్న।
నీవాస్థితిబొందగోరుమన్న। భారమనిభయపడవలదన్న।
వేరుగానెంచిచూడరన్న॥ వారివీరిబోధలవిడిమోక్షముదారి
గానరన్న। యీతీరునదీక్షబూనుమన్నా। శ్రీ॥

యీషణములమూడింటి కవ్వలవిశేషమెరుగుమన్న।
సర్వగుణదోషరహితమన్న। భక్తజనభాషలువినుమన్న।
అరయనవిశేషమిదియెనన్న॥ వేషభాషలునులేనిసుజనులకు
భూషణమిదియన్న। మదినిదుర్వాసనవిడుమన్నా॥ శ్రీ॥

8. పంచభూతములమించిగాను మది నెంచిచూడుమన్న।
అందుపై మించివెల్గునన్న। బుధులుబోధించునదదేయన్న।
దేశకులపంచజేరుమన్న॥ నీకించద్గుణములడంచియాత్మ
సేవించుచుండుమన్న। అంతనీసంచితములుసున్నా॥ శ్రీ॥

9. గాత్రములోపలనేత్రమధ్యమున సూత్రమెరుగుమన్న।
ఆంతతాపత్రయమిడునన్న। హృదియుపావిత్రంబగునన్న।
అరశితన్మాత్రలణచరన్న॥ యీధాత్రిలోనయీసూత్రముగన
సత్పాత్రులనడుగన్న। ఆపైగలచిత్రముగనుమన్నా॥ శ్రీ॥

10. మేటియైనకంతేటికివిరగురు సూటితెలియుమన్న।
నాటిపారబాటుబాపునన్న। మాటికిత్రికూటమందరన్న।
మీాటిపై చోటుదెలియుమన్న॥ ధాటిగానుము య్యేటిగడచితను
మీటుజెరుగుమన్న। యిదియెఘనబాటదెలియుమన్నా॥ శ్రీ॥

11. పొంకమైనపరతత్వము దెలియాటంకమువలదన్న।
నీలోనోంకారముగనుమన్న। మదినిసంకోశమిడువుమన్న।
గురునిపదపంకజమెరుగన్న॥ నీశంకవిడచిపోతానబోయిన
కొంకయనడుగన్న। ముందునహంకారమిడువుమన్నా॥ శ్రీ॥

ఆనందసుధాలహరి.

కీర్తన. కన్నడ—రూపకము.

1. నిన్నెనమ్మియున్నా। పన్నగశయనా(శ్రీరామ॥ ని॥
మన్ననాతోబ్రోచెదవని। నిన్నెసదావేడుచుంటి।
కన్నడజాయాకవేగ। గావుముజగదీశయీశ॥ నిన్నె॥

2. యీషణములబాపివేగ। ద్వేషములేకుండసర్వ।
దోషరహితనాదోషము। నాశనమొనరించుదేవ॥ నిన్నె॥

3. సంచితములదృంచివేగ। మంచితోబ్రోవజూపియునా।
కించలెల్లబాపిసమంచితముగ ననుబ్రోవురామ॥ నిన్నె॥

4. మూడులోకములలనెల్ల। నాడించెడిపరమాత్మ।
యేడజూడనేడునీ। జాడదొరకదేమిసేతు॥ నిన్నె॥

5. పంచషింశతతులనెల్ల। ధ్వంసముగావించియునా।
సంశయములబాపయు। నిస్సంశయునిగజేయురామ॥ నిన్నె॥

6. జారచోరగుణములెల్ల। బారదోలెఘోరవునీవని।
మారజనకనినునేయే। మారకస్మరియింపుచుంటి॥ నిన్నె॥

7. వీరగురుస్వరూపుడవై॥ వెంకయాఖ్యునిమొరాపిని।
పరమాత్మ నీలోనన్ను జేర్చెదవంచూనుచాల॥ నిన్నె॥

నవరోజు—రూపకం.

1. శంకలేలమముబ్రోవుము। శరణునుహేశా।
యింకానీకన్నను దిక్కెవ్వరుయీశా॥
పంకజాతనాథాగ్నిశ। శాంకనే(త్రనేనునీదు
కింకరుడనుయిత్తరినా। సంకటములుబాపుముశివ॥ శంక॥

2. ఫాలనే(త్రహిమగిరిజా। బాలకళాతా(।
కాలాంతకాకాలకంఠా। కమలజపూతా(।
లీలామునిజనకుల పరిపాలాఘనశీల।
నన్నేలమేలమేలయిపుడు। హాలాహలహరహరహర॥ శంక॥

3. కందర్పశరీరనాశ। ఘనగిరివాసా। దందశూకహారాహాఘ।
దళితగిరీశా॥ కుందనగిరిచాప(త్రిపుర। సుందరిమోహనరూప।
నందిఘూటవెంకయనిటు। నాదరించుమిచ్చోటా॥ శంక॥

కీర్తన. పూరీ—ఆట.

యెంతపాపపుజాతిజన్మము। యీధరణిలోనా దెంత॥ పా॥
యెంతపాపపుజాతిజన్మము। సంతతముగురుసేవజేయక।
చింతనొందూచూనుమరిసీ। చెంతజేరిభజింపనైతిని॥ యెం॥

1. సంతకూటములోనజిక్కితీ। సతతంబుసాధులజెంతజేరలేక
పోయితీ। సతులతోటిరతులమరగి। వెతలునొందుచునుంటిగాని
సతతమునునినుదలచనైతినిస్వామినా। గతియేమియిపుడికి॥ యెం॥

2. పాపపుణ్యములకునులోనైతీ। పరమార్థమునకుపాటుబడకను
పాలుమాలితి॥ ఆపాజ్యోతై వెల్గుచుండె।
యాత్మరామునిజూపెగురుని। తేపతేపకునామనంబున।
జ్ఞాపకముచెయలేకచెడితిని॥ యెం॥

3. కామక్రోధములుడుగనైతినీ। కడతేరెమార్గముగానలేకను।
కష్టపడితీని॥ పామరత్వముచేజరింపుచు। పరమహంసైఖ్యము
నెరుంగకనియమనిష్ఠలలోనజిక్కి।నిన్నుకన్నులగాననైతిని॥ యెం

4. ఆలిసుతులనుజూచిభ్రమసితీ। కలకాలమునువట్ట్యాశలో నేనంటి
తిరిగితీ॥ జాలమూజేయూచునేను। కాలమెల్లాగడపివృధగా।
మేలుగానాలేకతుదకు। కాలునీపాలైతినయయో॥ యెం॥

5. నిక్కమేదోతెలియనైతీనీ। నిఖిలంబునీవనినిశ్చయంబుగనమ్మ
నైతీని॥ దుఃఖసాగరమునమునింగీ। దుర్మదాంధాకారమునను।
గ్రక్కునకడతేరెమార్గము। గానలేకనుచెడితినయయో॥ యెం

6. పరముజేరేమరుగుదెలియకను। సద్గురునిమనమున।
స్థిరముగాస్మరియించనేరకను। మరువకనుశ్రీవీరయార్యుల।
చరణములమదినమ్మినేను। సరగుననుపూజించకను।
దుశ్చరితములపాలైతినయయో॥ యెం॥

7. మూడుగుణములువిడువనైతీనీ। మూడింటికవ్వల।
మూలమేదోతెలియనైతీనీ॥ మూడుమూడూగడువలేకను।
మోహనాంగులపొందుగోరుచు। మోసపోయితనుచు
వెంకటదాసు। డిటుమొరబెట్టుచుండెను॥ యెం॥

తత్వము. ఆనందభైరవి—ఆట.

1. దాసోహమిదుగో గురువర్యానా। దోసాములను బాపుమార్యా॥
దాసులకు యే కాలమున నే। దోసములు రావనుచు తావక।
శేషమిచ్చి విశేషమిదియని। శేషభూతిని జేయుమికనా॥ దాసో॥

2. పాపాలలో పాలనయ్యా। నున్న। రూపే వ్యాపకమాయెనయ్యా॥
రూపరూపములోనబయలున। తేప తేపకు జూచుచుండిన।
ఆపజ్యోతులస్ఫటిక తేజము। చూపవా ప్రపనినమ్మితినినా॥ దా॥

3. హంసోహమిదియాని దెల్పి। నాసంశాయమును దీర్చి నిల్పి॥
హంసయందున మనసు గల్పియు। హింసలను దొలగించుకొనపర।
హంసలై యుండెదరటన్నను। సంశయము విడిపోయెనికనా॥ దా॥

4. నామారూపము లేకయున్నా। దాని। నాశీకాగ్రమునందుగన్నా॥
పామరులు మిము కోరిననునా। పామరత్వము బాపి యూవల।
రామనామము దెల్పి పారం। ధామమును జూపించితిరినా॥ దా॥

5. దరిజేర్చవయ్యా గురురాయా। పరమగురుడావని నిను నమ్మితయ్యా।
స్థిరత పోతన బోయిన వెంకయ। నిరతమును శ్రీవీరగురువరు।
చరణవారిరుహములకు నుతిసి।శిరము జేర్చి నుతింపుచుండెను॥ దా।

తత్వము. నాదనామక్రియ—ఏకతాళం.

1. కోరి సద్గురుని సన్నిధి పరముకు। దారిగంటి నిరభరన్నా।
సారె సారెకును హంసోహంబని। సంశయరహితంబై యున్నా॥ కో

2. కుడియెడములలో నడిసుషుమ్నమున। కూడియున్నదిరభరన్నా।
యెడబాయక నీచరాచరములకు। నేకసూత్రమదిగనుగొన్నా॥ కో

3. అంటియంటకనుఅన్నియుతానై। జంటబాయకుందోరన్నా।
కంటికిమింటికి రెంటికియవ్వల। యొంటిగనున్నదివినుమన్నా॥ కో॥

4. మోసపోక మూడాశలు మొదటికి కోశి వేయవలెరోరన్నా।
నాశికాగ్రమునయీశునిగనుగొని। రాశి జేయవలెరోరన్నా॥ కో॥

5. కామాంధుడవై నియమనిష్టలను। పామరమున జేయకుమన్నా।
యేమారక నాసామియితండని। సామగానమును వినుమన్నా॥ కో॥

6. అందనియిందనిసం దేహంబులు। పొందగనేటికిరోరన్నా।
ముందుగగురుపదమందుమానసము।పొందించినజగములుసున్నా॥
7. శేపుమాపనకవీరయార్యులను। పాపినినమ్మితినోరన్నా। [కో॥
చూపులకవ్వలరూపువెంకయ్యై। వ్యాపించుటనిశ్చయమన్నా॥కో

తత్వము. దర్బారు—ఆట.

1. దాసవరులారావినండీ। నాకే। దోసమున్నమన్నించండి॥
దాసులకుయేకాలమునయే। దోసములులేవనుచుసద్గురు।
శేషమిడుటవిశేషమదిసవి। సేషినైకడతేరితికనో॥ దా॥
2. పాపాలలోపాలనేడా। కను। చూపునిల్పిచూడచూడ॥
వ్యాపకముగనులోనుబయలై। వెలుగులకువెలుగయ్యె ప
యాపజ్యోతినంటిగంటిని। తేపతేపకుతన్మయుడనై॥ దా॥
3. హంసోహమిదియానిదెలసీ। మానో। సంశాయామునీరినిలచీ॥
హంసయేసర్వాంతరాత్ముడు। హింసలనుదొలగించుసత్యము।
వంశపావనుడగుచునుండిన। వంశధరుశేవింపుచుంటిని॥ దా॥
4. నామారూపములేకయున్నా। దాని। నాశీకాగ్రమునందుగన్నా
సామిసద్గురురాయునిజపద। తామరసములుగొలచియలనీ।
రామయముసై వెల్గుపారం। ధామమాత్మారామమైతిని॥ దా॥
5. దరిజేరగంటిమీకరుణా। మీకు। దాసూడసద్గుణభరణా॥
యరమశేమియులేదుయిదియే। స్థిరపథంబనిపీరయార్యులు।
పరమగోప్యమువెంకయకునిటు।మరుగుదెల్పినమరువకుంటిని॥దా

తత్వము. శంకరాభరణం.

1. యంతవారలెంతవారలేసదయులా మాగురులెంతవారలెంత
వారలే। యంతవారలౌరవారి। చెంతజేరుభక్తులాకు।
చింతబాపివింతగహృద। యాంతమందించుమాగురులెంత॥
2. అంధకారమెడలదోసియు। యాపైభక్తాభ్యందములతో।
పొందుజేసియు॥ ముందుదేహిదేహములకు। సంధియిదియటంచు
మాకు। అందముగనుదెల్పియా। సందమయునిజేయుమాగురు॥

3. సాధనములునాల్గుదెల్పియు। యీపైనియాత్మ। బోధజేసి గాధదీర్చియు॥ ముదముతో చాతుర్విధముల। వదలకసేవింపుమ నుచు। విధియతివేదార్థములను। సదమలమతిదెల్పుమాగురు॥ లెం
4. అజ్ఞానారణ్యమునుంచి। దొలగించిమమ్ము। సుజ్ఞానాసుగతిని గూర్చి॥ ఆజ్ఞలోనసమరనిల్పి। సౌజ్ఞజేసిసారెసారెకు। ప్రజ్ఞానంబ్రహ్మమనియె। దీక్షనిడనుచుమాగురు॥ లెంత॥
5. దేహభ్రాంతులెల్లబాపియు। యీమీదనుగల। దేహిమర్మమెల్ల దెల్పియు॥ యీహాపోహలమరజేసి। సోహంభావమందునిల్పి। మోహాసూన్యమైననీవె। యహంబ్రహ్మమనెడిమాగురు॥ లెం॥
6. కాయములైదింటిమర్మము। సద్గురునివలన। మాయగాను నెరుగ ధర్మము॥ రేయుబగలులేకనున్న। హాయిదంచుపాయముననుు। అయమాత్మబ్రహ్మమూను। స్వాయముగానుజూపుమాగురు॥ లెం
7. సుప్తిరజితభ్రమనుదీసియు। ఆవెనుకయాత్మ। జ్ఞప్తిదెలపి సత్తుజేసియు॥ యిత్తరినిదిగనుమటంచు। తత్తరలనుతరుగుపరచి। మొత్తమిదేజగమునకని। తత్వమసిత్వమనుమాగురు॥ లెం॥
8. సంకటములుసమసిపోయెను। బ్రహ్మైక్యముకా। టంకమేమి లేనిదాయెను॥ పొంకముతో శ్రీవీరగురుప। దాంకమెపోతాన బోయిన। వెంకయాఖ్యశంకలన్ని। గ్రుంకజేసెనారమాగురు॥ లెం

తత్వము. ముఖారి—ఆట.

1. పూనిసద్గురుసేవజేసినవారికి। జననమరణములేదికా॥ జననమరణప్రవాహములోబడి। మునిగితేలుచునుండనేటికి। యనయమునుశ్రీగురుపదంబులు। మనమునసుపూజించుడికనూ॥
2. పంచాక్షరిమంత్రపఠనపరులకుయిక। సంచితాములు [పూని॥ లేవటా॥ పంచతనువులుపంచవస్తలు। పంచకోశప్రపంచవృత్తుల మించియవ్వలగల్గుదానిని। గాంచుమనిబోధించినారు॥ పూని॥
3. పాపాలలోపాలదీపించుచున్నట్టి। యీపజ్యోతులకవ్వలా॥ వ్యాపకంబైలోనుబయలున। వెలుగులకువెలుగై వెలింగెడి। యీపరాత్పరుగాంచినీలో। యనయమునుసేవించుమనిరీ॥ పూ॥

4. ఏకాత్మరంబా నెయల్లా దేనుగ నెక్కి। మెరుకాపా త్రిడమానికి॥ యేకమైనిరుపాధికంబై। మెరుక మరపులు లేనిబయలును। జోకతో సేవించుమనిగురు। చూచనిడికట తేర్చినారు॥ ప్రా॥

5. హంసాభావము దెల్పియొక్యామయ్యేడిచోటు। యమ్మతమానుచు దెల్పిరి॥ సంశయింపకు శంకయాయని। శబ్దరహితముకనుల జూపియు।హింసనీకిక లేదటంచును।వీరయార్యులు దెల్పినారు ప్రా

తత్వము ధన్యాశి—ఆట.

1. మరువనే। గురుచరణములనే మరువనే॥ మరువనే శ్రీవీరగురువరు। చరణములు నెమ్మనమునందున। సరగుననునాశిరముపై తన। కరము జేర్చిటుశాజ్ఞజేసెను॥ మ॥

2. సోహమే। యెరుకామెనిదిగన। మోహమే॥ సోహముకుషోడశవికారా। సూత్రమేమంతార్థమనుచును। యూహకల్లగ జేసితనపై। మోహమెడలగ జేసెనికనే॥ మరు॥

3. కంటినేసద్గురునికృప। గనుగొంటినే॥ కంటినేగురుకృపాదృష్టిని। కంటిమింటికి రెంటికవ్వల అంటియంటకసచలమైతా। వంటిగానేయున్నవాని॥ మరు॥

4. బాసెనే। కర్మత్రయం బెడజేసెనే॥ డాశిపోతనబోయిన శంకట। దాసపరమార్థంబిదేనని। దోసరహితంబై నబయలును। జూచిహంసైక్యపరుడగుమనె॥మ॥

తత్వము. పున్నాగ—ఆట.

మెరుగరయ్యా దేవునిమెరుగరయ్యా। అజ్ఞానులెప్పుడు॥ మె॥ మెరుగరయ్యా దేవునెప్పుడు। వేదశాస్త్రపురాణవాదులు। గురుముఖంబునగురుతుగనకను। కుజనులై తిరుగుచునునిజమును॥

1. వాశిగాపరమనెడిమాటను। లేశమైనను దెలియకనుమది [మె॥ ఈషణత్రయబద్ధులై విర। వీగువారలుమెన్నటికిమది॥ నె॥

2. గురునిపాదసరోజము లెప్పూట్। సరణియంతర్ వేదినిడుకొని। మరువకనుస్మరియించుచు టే।పరమనుచుమనమునపాటుబడకను॥మె

3. ఆత్మారామునికర్పితంబని। యఖిలకర్మలుజేయుచుండుము।
యాత్మారామునికంటదెప్పుడు। యనుభవించకతీరదనిమా॥ రె॥

4. ఆశజేతనెజన్మకర్మలు। యార్జించుటమూలమాయెను।
ఆశలుడుగుటెముక్తిపథమని। యార్యులగువీరగురువాక్యము॥ వె॥

5. వేరుశాయకసర్వమునుతన। తీరుగాపరికింపుమనుచును।
సారసారెరువెంకయాఖ్యుడు। చాటెనిదిముమ్మాటికినిమది॥ వె॥

తత్వము. నాదనామక్రియ—జుల్వ.

యెరుకవిడచినవాడువేదాంతియన్నా। యెరుకవిడువనివాడు
కాడుమాయన్నా॥ యెరుకమరచినచోటుయెరుగుటేగురుత
నుచు। యేమారకనుగురినియెరుగుమాయన్నా॥ యె॥

1. నాల్గుసాధనలెరుగవలెనుముందన్న। నాదినీదనెవాదభేధము
డుగన్న॥ ద్వాదశాబ్జముననీవుదృక్కునిల్పన్న।
దృక్కుదృశ్యముసందుదృప్తిగనుమన్నా॥ యెరు॥

2. అష్టాక్షరీమాంత్రయర్థమెరుగన్న। అండమందునపిండమ
మరియుండన్న॥ పిండయండముమధ్యప్రణవముండన్న।
ప్రణవమెరిగినవాడెబ్రంహ్మవిదుడన్నా॥ యెరు॥

3. తారకమునూటెరిగితరచవలెనన్న। సూత్రాత్మలోనున్నసుఖ
ముగనుమన్న॥ తానుతానైయున్నతత్వమెరుగన్న।
తత్వమెరిగితెబ్రంహ్మతాయానన్నా॥ యెరు॥

4. యీడపింగళిజాడగూడిమనుమన్న। యీడుగానీవారిజోడు
గూడన్న॥ వీరయార్యులపూజవిధిసల్పుమన్న।
పూజజేసివజన్మపూర్ణమగునన్నా॥ యెరు॥

5. యెరుకతాననివల్కుటిదివెర్రియన్న। యెరుకతానైబ్రంహ్మ
మెరుగుటెట్లన్న॥ యెరుకమరపులసందువెల్లడేదెలియుమని।
వెంకయాఖ్యుడుదెల్పెవిదితముగనన్నా॥ యెరుకవిడచిన॥

తత్వము. ఆనందభైరవి—అట.

1. వొక్కడే దేవుండొక్కడే। సర్వాత్మకుండఁట। ఒక్కడే దేవుం
డొక్కడే॥ వొక్కడే దేవుండుమీర। లక్కడిక్కడ వెదుకనేల।
చక్కనగు సద్గురూక్తంబగు। దృక్కుచేగనుగొనెడివారల॥ కొ
2. వేదశాస్త్రపురాణబోధల। గాథచే దెలియంగరాదు।
మోదమునతిను పంచకంబుల। మీఁది సారము చేగనుంగొన॥ వొ॥
3. అందుగలడనియిందుగలడని। సందియము జెందంగనేటికి।
క్రిందుమీదుముందు వెనుక। యెందుజూచిన నందె గలడఁట॥ ఒ॥
4. నిక్కముగ ద్వైతంబు నెరుగక। ఈక్కవలె దిరుగంగనేటికి।
దృక్కు దృశ్యంబులకునడుమను। పక్కవతోగను గొనెడివారల॥
5. పొంకముతో శ్రీవీరగురుపద। పంకజముపోతానబోయిన। కొ॥
వెంకయా విధు డెరుగుటకుదా। నంకమైగనుగొన్నద్వైతం॥ ఒ॥

తత్వము. కాంభోజి—అట.

పరిపూర్ణాముమజూపి। యెరుకొసగనిగురుడు। మరిమ్మారిబోధించి
మమతాలబాపెనే॥ గరుడగంధర్వయక్షులుకి। న్నరనరస్త్రోమా
దిసచరులునిరతమును సేవించిగుసుసి।పదము జేరితరించిరనియిటు॥ ప
1. పంచాభూతాత్మికమయినశరీరమిది। యెంచీమోహాముల చేధిం
చుమానెనే॥ సంచితాగామిములకడ దివ్య। పంచవృత్తులదగలకను
అల పంచవస్తలమించి యెరుకను ద్రుంచిబయలునుగాంచుమనియె
2. ఖండాఖండముగాక నిండీనిర్మలమైతా। నుండీబయలై [ను॥ప॥
యుండు। నిండామున్నీరుగా॥ యుండవమావులపగిదియెరుకి।
ట్లుండుననిమదినుండజూపియు। అండపిండాండములమరిబ్రం।
హ్మాండములఖుగిలుండుమనియని॥ పరిపూ॥
3. సర్వాకాలములందు। సాక్షీలేకనెయుండు। సర్వాభూతములాకు।
సాక్షీగాతుండూ॥ విరివిగా శ్రీవీరగురువరు। కరుణాపోతనబోయిన
వెంకయ। యెరిగి తెల్పినమరుగుయిదియని।
పరమ్ముగనిగురిమరువకుండుము॥ పరిపూ॥

తత్త్వము. వరాళి—ఏకతాళం.

మాటలు లేవుగదే। మనసార పాటలు బోయెగదే॥ మాటిమాటికి ని
మేటిపథముపై। సూటి జేయుఘన బాటలో మనకిక॥ మాటలు॥

1. దేహము లేదుగదే। యిహపర మోహముపోయెగదే॥ యూహాపో
హాలతో। స్నేహము మానివి। దేహాలమైనం। దేహముదీరిన॥ మా॥

2. ఆశలు లేవుగదే, ఘనగురు। ధ్యాసలులావుగదే॥ దేశకువలనుప।
దేశమందితెను। వాసనలుడిగిని। రాశజెందినను॥ మాటలు॥

3. బాధలుపోయెగదే సద్గురు। బోధలుహోయిగదే॥ ఖేద మోదముల
గాధలబడకను। నాదములయమా। పాదుగాంచుతరి॥ మాటలు॥

4. భారముదీరెగదే। యాత్మకు। వేరిక లేదుగదే॥ మారుతమునతా
దూరిచూచితేఁ। మీరిపరాత్పరు। జేరువేళనిక॥ మాటలు॥

5. సంశయమీడెగదే భ్రాంతి। ధ్వంసంబాయెగదే॥ హంసోహంబను
యంతర్నాదవ. తంసముపరబయు। లందుగలియుతరి॥ మా॥

6. కరుణగల్గెగదవే। సద్గురు। చరణములందెగదే॥ కారణమిదియని
వీరగురుడునను। పరము జెందుమని। యెరుకబాపుతరి॥ మాట॥

7. అనుభవమాయెగదే। తత్త్వముగన, ఘనమాయెగదే॥ అనయము
వేంకయ। తనుతామీదియు। తనుద్వయంబుల। నణచగమనకిక॥ మా॥

తత్త్వము. శుద్ధకాంభోజి—ఆట.

ఉన్నాదో లేదో లేకున్నాదో యనిమీరు। అన్నా లారమదిని
అనుమానపడనేల॥ ఉన్న దానిలో లేని దెరుకని।
యున్న పరిపూర్ణమును దెలసియు॥ యెన్ని యెరుకనుసున్న జేసితె।
యున్నదె పరిపూర్ణమగునదే॥ ఉ॥

1. ఆదియంత్యము లేక అడియాడియనరాక। యేదీగాకను బ్రహ్మ
మెదుటయున్నదియదిగో॥ సూది మోపనుసందు లేకను।
పాదుకొని బ్రహ్మాండమంతట। పోదినిర్మలమై చెలంగు దేస।
సదాగను గొనుమటన్నను॥ ఉ॥

2. ఇదుగో దెల్పెదవినుడీహృదయాంతమే బ్రంహ్మా।
మదియేపిండాండాంతమగునాదయెరుకాయ॥
ల్లదియెసద్గురుబోధగురుపద, మొదలకనుయెరుకాంతమునుగన।
మొదలుతుదమధ్యంబులేనియదినుపరబయలనియెరింగియు॥ ఉ॥

3. వెన్నెలలోపాల వలగకాయలరీతి। యున్నాయెరుకనుదెలసి
సున్నాజేయగలేక॥ యెన్న రానటువంటియెరుకను।
వున్నదనిదానిలోపలబడి। తన్నుకొనుచునుమన్నుమిన్నా।
కన్నమిగిలున్న దేపూర్ణము॥ ఉ॥

4. యుక్కాడజూచినవక్కారీతిగనున్న। నిక్కాము దెలియాక
నిక్కి తిరిగెదరేలా॥ ముక్కుతుదగలదేతవనుచును।
చొక్కి ద్వాదశకెక్క నేరక। దిక్కుయూకాసం బెయనియెడి।
కుక్కలకునిక్కంబు దెలియునె। ఉ॥

5. ద్వాదశా శాస్త్రిలోనిబోధా దేలసుకయిలేరా।
సాధానలనుమానివాదాముబిడుమనిరే॥ మోదముతో శ్లోక
శాస్త్రిలో। గాథలన్నియుదీరుపస్తై। అదిదెలియును
వెంకయని। అవలె ... పనుపిరియార్యులు॥ ఉ॥

తత్త్వము. నాదనామక్రియ—ఆది.

1. హెచ్చు దీనికెదనిగురుపరుచ్చి సద్ద్వాదశిఅదేకదా।
చచ్చుచుబుట్టుచుసకలముతానై సంచరించునదయిదేకదా॥ హె॥
2. తథ్యముగా మతనకు జ్ఞానస్వాతిస్సిద్ధంబై సదిఅదేకదా॥
అధ్యారోపమైమధ్యనుశోచిమిథ్యాపోయ్యెదిదేకదా॥ హెచ్చు॥
3. అంతటనిండియుఆత్మనాత్మలను ఆవలనున్నదిఅదేకదా।
పంతములాడుచుచింతలునొందుచుసంతతముండనిదిదేకదా॥ హె॥
4. పంచతనువులకుపంచవస్తులకు మించియున్న బయలదేకదా।
పంచరంగులలోపరంజ్యోతియై ప్రణవంబై నదియిదేకదా॥ హె॥
5. నాదుబిందుకళనాటకమావల నాణ్యంబై నదిఅదేకదా।
నాదములోపలభేదమునంతయు వేదంబై నదియిదేకదా॥ హె॥

అడుకపాడకయాడజూచినను ... యున్నదిఅదేకదా।
యాడపింగళనాడిసూప్ర ... చునున్నదియిదేకదా॥ హే॥
యక్కడజూచినచక్క ... టిల్లునదిఅదేకదా।
... లేనిక్కై ... చునీలైదదేకదా॥ హే॥
యెన్నిజనించినయెన్నినశించిన ... టికున్నదిఅదేకదా॥
తన్నుతాను నెన్నగబోవుచు ... హొయ్యేదిదేకదా॥ హే॥
యిరువదినాలుగుయిరువదియైదుకు పరమైయున్నదిఅదేకదా॥
క్షరమక్షరమైచదువుశాస్త్రమై సచలంబైనదియిదేకదా॥ హే॥
కాలకాలములజోలినెరుంగక మేలుగనున్నదిఅదేకదా।
నాలుగుతనువులునాలుగవస్థలు నారుకోశములుయిదేకదా॥ హే॥
పలుకులకందకభావమునొందక వెలయుచునున్నదిఅదేకదా।
కలలోదోచెడికరులవిధంబున కల్లైపొయ్యేదిదేకదా॥ హే॥

వ్యష్టిసమిష్టిశివజీవైక్యము నిష్టలెరుంగనిదదేకదా।
సృష్టిస్థితిసంహారకర్తయై నష్టంబయ్యేదిదేకదా॥ హే॥
అజ్ఞానముప్రజ్ఞానములేకను అచలంబైనదిఅదేకదా।
ప్రజ్ఞానముపరబ్రంహ్మంబని బహుప్రజ్ఞలుపల్కెదిదేకదా॥ హే॥
అహమనరాకనుదేహిదేహముల యూహలకంటనిదదేకదా।
అహంబ్రహ్మమనిదేహముతానై మోహముజెందేదిదేకదా॥ హే॥
భావభావములులేకను బట్టబయలై యున్నదిఅదేకదా।
జీవేశులకుతదేకత్వంబై కావరమొందేదిదేకదా॥ హే॥
ద్వయరహితంబై స్వయముగనంతటబయలై యున్నదిఅదేకదా।
అయమాత్మనుబ్రంహ్మంబనియనుచునుద్వయమైపొయ్యేదిదేకదా
మల్లెపిద్దికృష్ణార్యులుపొందిన మహనీయంబగునదేకదా। [హే॥
తెల్లమిగనుశ్రీకృష్ణగురువునకు కల్లైపోయినదిదేకదా॥ హే॥

మేటియైనకోటేశ్వరునకు మదినాటినపూర్ణంబదేకదా।
సాటిలేనివీరేశ్వరస్వామికి బూటకమైనదియిదేకదా॥ హే॥

19. యెరుకమరపులను మెరిగెటి మెరుకను మెరుగకయున్న దిలదేకదా
మురయుచుక్ష్మ స్థాయూరుయ్యనకును నిర్మ్మలంబై నదియిధేకదాహెా

తత్వ॥ యమునాకళ్యాణి—ఆది.

బట్టబయలుగ దెలియవలెనన్న। పరిపూర్ణమదిరా॥ బ॥
బట్టబయలుగ దెలియకెప్పుడు। వట్టిమాటలవాదమేటికి।
గట్టిగా యెరుకాంతమునగల। దిట్టదనిమదిదెలసినీవికి॥ బట్ట॥

1. ముందుజ్ఞప్తిలొసంధిగనుమన్న। గనుగొన్నదానిని యందముగ
తాపడువవలెనన్న॥ యెందరోదీనందమెరుగక। డెందములతొ
గుందుచుందురు॥ క్రిందుమీదుముందువెనుకా।
సందరహితముపొందుటకును॥ బట్ట॥

2. ఉన్నదున్నటుజూడవలెనన్న। యామీదలేనిది।
యెన్నియెరిగిన గుర్తుపిడుమన్న॥ ఉన్నదున్నదియన్నదానిని।
సున్నజేసెడిగురునిజేరి। యెన్నివిధములనైనయెరుక।
కన్నసూన్యంజేదిలేదని॥ బట్ట॥

3. సగుణనిర్గుణములనువిడుమన్న। యాపైనగలిగిన।
యగణితంబగుబయలుగనుమన్న॥ నిగమమునగలనిక్కమిడని।
యుగమునూన్యముగాను దెలిసి। తగునచలభావంబుదెల్పెడి।
సుగుణులగుసద్గురునివలన॥ బట్ట॥

4. జ్ఞప్తిషుప్తులురెండుకల్లన్న। ఆయుక్తిదెలసిన। సత్తుచిత్తానంద
మేదన్న॥ యిత్తరినియాసక్తితోతా। నుత్తదేననిదెలసియావల॥
వృత్తబయలేమొత్తమనితను। తత్తరలనణగంనగాను॥ బట్ట॥

5. శంకలెల్లనుమానివినుమన్న। యేవంకజూచిన। అంకమే శ్రీవీర
గురులన్న॥ పొంకముతొపోతానబోయిన। వెంకయాఖ్యాదెరిగి
జెల్పిన। దింకనేమియులేనిబయలని। జంకకనుసరగునసునీవిక॥ బట్ట॥

ఉ. రెక్కలునెత్తిపైకి జనురేచరులెల్లనడంగుదానిలో
జక్కగగుంభినీ దిరుగు సామజయానముగల్గువారికే
జిక్కుమరెవ్వరైనవిని జిత్రమునొందు టెగానిగాంచలే।
నొక్కఖగంబుబట్టుటకు యోగ్యులకొన్నదిదెల్పుడీఘనుల్,

## మంగళహారతి. సురట—ఆట.

1. సకలదేశములందుసకలకాలములందు సకలవస్తువులందుసమయు
చుండ॥ నికరామైయంతాటనిండి వెల్గుచునున్న అకలంక బ్రహ్మా
మునుప్రకటించుగురునాకు॥ మంగళంమంగళంసద్గురుజీవా॥మం॥
2. పుట్టుగిట్టులులేనిబట్టబయలిదియానిగట్టిసద్గురునీచెగుట్టుదెలసి
వట్టిదిజగమానిదిట్టపరచిమది పట్టువిడుపులులేనిభావజ్ఞులకుజయ॥
3. కావారమునులేకజీవఘూశులకవల భావాభావములేని [మం॥
పావాసమై। కేవలాత్మ్యండేటి కీలుదెలియజేసి।
చావుపుట్టుకలణచెడవ్రూపా గురునాకు॥ మంగళం॥
4. సాధనంబులుమానిసద్గురుని సేవించినాదాంతమైయున్న పాదు
దెలసి। వాదాభేదముచెడువలేదు జన్మంబానివాదాముతో
డూతబోధించుగురునాకు॥ మంగళం॥
5. పంచతనువులుగాక పంచవస్తులులేక సంచితాభూతాపంచకము
గాక। పంచవింశతికమించియువెల్గేటి కొంచాగొప్పలులేని
చంచాలరహితునకు॥ మంగళం॥
6. పరిపూర్ణమిదియానియెరుకాతో జూపించి తరువాతనెరుకానుం
తరిమివైచి।మరిదలచబోకాని శిరమూనకరముంచి
మురయూచుదీవానమునుజేయు గురునాకు॥ మంగళం॥
7. జ్ఞానాజ్ఞానములేకనేనుమేనులుగాక రానిపోనిదెజ్ఞానరహిత
మనుచు। కానరానిదానిలేనేలేదని తెలసిమానావమానములు
మానూమనెఘునునాకు॥ మంగళం॥
8. పన్నెండుపదహారుయెన్నుమానుచుగురుడన్న వాక్యము
లాచెపన్నుగాను। యన్నాదివిన్నాదికన్నాదిసున్నాయై
వున్నాడెవున్నాదియన్నాగరాకను॥ మంగళం॥
9. సారాములేనిసంసారాబ్ధిదాటించి ఘోరపాతకములగొట్టివైచి
ధారూణికృష్ణయభిధానూనిబోధించిన ధీరులాశ్రీవీర
దేశికేంద్రులాకు॥ మంగళం మంగళం॥

చంపకమాలిక:—

సలలితమైనమార్గమిది సత్యము గాఁ తనువింద్రియంబులున్
యలపవనాళిగా వృమన మైనను గా వృమనీవచిత్తమున్
వలనగు కాంక్షలన్ విషయ వాంఛలుకోశములున్ యవస్థలున్
దెలివి వికారిఁగిసర్వమునుఁ ధీరత గాంచెడిద్రష్టనంచుని
ర్మలమతి గాంచిగాంచినది రంబును నేననియెంచియెంచగా
నలఘుయు నేక కారణము నైన సచరాచరభూతకోటిలో
వెలినిజగించు గాత్రిణమున పేరనరాకవచించువాక్కులో
గలశిజగంబుతల్లయము గాంచియనారతమున్ యఖండమై
నిలచినదేవిదేహమును నిర్గుణమున్నగనీఁవిదంతయున్
దెలసితమంబుశాసియుప దేశవిగమ్మితులంచుసద్గురు
ల్బలుకనెఱుంగలేకకడుఁ ప్రాజ్ఞులమంచుజరించుచుండురి
మ్మలఁసగుణంబునిర్గుణము మూలముగాదిదిమూలమంచుమా
టలవలపించిలోకమునఁ డంభయశంబులుగోరుచుండువా
రలవిఁడనాఁడిసత్యముఁన రాతిజయంబునుమానవిఁష్ఠయున్
గలసుగుణాభిరాముపద కంజములన్ విడనాఁడ కెప్పుఁడున్
గొలచితఁదోక్తమార్గమునఁ గూరిమిగాంచిజరించుసట్టుఁభ
క్తులఁగనినంతదుష్కృతము దోఁడనఁడంగు సటంచుశాస్త్రముల్
బలుకగతజ్ఞులిప్పిధిని బల్ మరుదెల్పనబొందలేనిఁదు
ర్బలులకుజన్మదుఃఖములు బాయగజాలవునిక్కమంచుదు
శ్చలనముమానిసత్యమునుఁ శౌచతపంబులుగల్గిదేశికేం
ద్రులుప్రచరించుమార్గమున ధీవరులై విషయేంద్రియంబులన్
గలగగనీకమానసము గాదనిఁదుర్భ్రమలన్ యడంచిని
శ్చలమతియోగధారణము సల్పినమోక్షమటంచుకోటయా
ర్యులుసుధలూరుధర్మనిఁచ యోక్తులబోధఁనొనర్చెగూరిమిన్
గలయుగగూర్చెవీరయ వికాశితచంపకమాలికాకృతిన్.

శ్రీగురుభ్యోన్నమః.

